సంపుటము 1] ఫిబ్రవరి 1915 [సంచిక 8

# బాలమిత్ర




బాలికా బాలురకు దివ్వె — బాగానేర్పు
లలిని చేకూర్చునయు విద్య — లందలిచ్చు
మిథ్యం బోగార్చు ధీం గూర్చు — మిరం దివర్చు
త్రప్పురహి "బాలమిత్ర" ము — త్రంబమర్చు"



## "యేసుయొక్క స్వంత చిన్నపిల్లను"

(యుద్ధపుకథ)

మొన్న జర్మనీవారి క్రూసరు చెన్నపట్టణము మీద ఫిరంగులు కాల్చినపుడు చాలామంది ఆంగ్లేయులకు,

హైందవులకు గాయములు తగిలినవి. కొందరు చనిపోయిరి. ఆ గాయములు తినినవారిలో ఆరుసంవత్సరములు ప్రాయముగల యొక చిన్నపిల్ల యుండెను. తల్లిదండ్రులకు ఆమె యొక్కతే పిల్ల. వారు రక్షణాసైన్యమునకు స్నేహితులు. వారు పట్టణములో జరుగు కూటములకు తరుచుగా వచ్చెదరు. ఈ ఫిరంగులు కాల్చబడు సమయమున ఫ్లాసీయను ఈ చిన్న పిల్ల పరుపుమీద పరుండి యుండెను. అప్పుడు జర్మనీ వారు కాల్చిన ఫిరంగిగుండ్ల యొక్క ముక్క ఆ పిల్ల పరుండియున్న గోడలోనుండి వచ్చి ఆమె ముఖమునకు తగిలి కోసికొని పోయెను. అప్పుడు ఎక్కడచూచినను ఫిరంగుల మ్రోతయు జనుల యేడ్పులు వినబడుచుండెను. ఆమె తల్లిదండ్రులు పరుగెత్తుకొనిపోయి ఆ పిల్ల పరుండియున్న స్థలమును దీపము పెట్టిచూడగా దీపము వెలుతురున ఆమె ముఖమునుంచి రక్తము ప్రవాహమువలె పారుచుండెను. అందువలన ఆ బాలిక స్మారకములేనిదై నేను చనిపోతే నా నాయనకు అమ్మకు చిన్నపిల్ల యుండదు గదాయని తలచి “ప్రియమైన ప్రభువా, నన్ను చావనీయవద్దు,” అని యేడ్చెను. అప్పుడామె తల్లిదండ్రులేమైన అనుకొనెదరేమోయని జడిసి తన తల్లినిచూచి అమ్మా “నేను యేసుయొక్క స్వంత పిల్లను గనుక భయపడను,” అని చెప్పెను. అప్పుడాపిల్ల తల్లిదండ్రులు ఆమె నెత్తుకొని

సురక్షితమైన మరియొక స్థలమునకు పోయిరి. అక్కడ ఫీలన్ ముఖమునకుకూడ మందువేయవచ్చును అని తీసికొనివెళ్లిరి. అయితే ఆ సాయంకాలము పట్టణమంతా గందరగోళముగా నున్నప్పుడు ఈ పిల్లవలె ధైర్యమును చెప్పగలవా రెవరును లేరు. ఆ పిల్ల చావు తప్పించుకొనినప్పటికిని చాలా ధైర్యముగా నుండెను. ఆ గాయము ఒక అంగుళము లోతుగా పడినట్లయితే తత్క్షణమే ఆ పిల్ల చనిపోయియుండును. మరణకాలములో ఆ పిల్ల "నేను యేసు యొక్క చిన్నపిల్లను;" యని చెప్పుటయు ఎంత ఆశ్చర్యమైన సంగతి. ఆమె అట్టి మరణావస్థనుండి తప్పించబడెను గనుక, యేసు కొరకు ప్రకాశముగల దీపమువలె ఎదుగుటకు మేము దేవుని ప్రార్థించుచున్నాము.

యుద్ధ ధ్వని

---

## జగడాలమారి జంబుకము

సీసము:— నక్కయొక్కటి చాల — మెక్క భండారంబు
నెచ్చోటనో పొంది — యెలమితోడ
భుజియింప నింటికిఁ — బోవుచుండఁగ నొక్క
జగడాలమారి యౌ — జంబుకంబు
కని దానిదరిఁ జేరి — వినయమున పల్కె
విన్నముగా నచ్చోట — విశదముగను





“ కయ్యమాడవలెను ; — కనుక నీవిప్పుడు
అది నాదియంచు నే — ననఁగ నీవు
‘ కాదంచు వాదించు ’ ; — మంగళారంభించు
నక్కోత్తమా ! నీకు — నాకుఁదగవు ”
విని దానిమాటల — విస్మయమొందుచు
“ జంబుకంబ ! మనకు — వాదమేల ?
వాదంబులాడను ; — నద్దుకయ్యంబును ;
కాదుగూడవనిన — నాదువస్తు
వులఁదీసికొనుము కా — వలసిన పక్షంబు
సంతసంబున నేనొ — సంగెద ”నుచు

తే॥ గీ. మిగుల సాత్త్వికముగఁ జెప్పఁ — దగవు దీర ;
జగడమునుఁ జేయఁగోరిన — జంబుకంబు
విడచివెళ్లె నచ్చోటిని — వేగిరంబు ;
సద్గుణముగదా సఖులార ! — సాత్త్వికంబు.

# జ్ఞానముగల గోరువంక

రాజ్యలక్ష్మమ్మకు ఒక పెంపుడు గోరింక కలదు. ఇది చాల తెలివిగల పిట్ట. చాల యుక్తులు నేర్చుకొనెను.



రాజ్యలక్ష్మమ్మ భోజనము చేయునప్పుడెల్ల ఆమె భుజముపై వ్రాలి ఆమె తిను ప్రతిదియు కనిచూచును. ఆమె ఎల్లప్పుడును తాను తిను దానిని గరిటెతో దాని నోటి కందించుచుండునది.

ఒకనాడు రాజ్యలక్ష్మమ్మ కాయిలాపడెను. వైద్యుడు వచ్చి, నీరును బ్రాందియును కలిపి ఆమె కిచ్చెను. ఆమె దానిని త్రాగునప్పుడు, గోరింక కూడవచ్చి ఎప్పటివలె భుజముపై వ్రాలి తనకును కావలెనని ఇచ్చినదాక తొందరపెట్టెను. దాని రుచిచూచినవెంటనే గోరింక చాల చిరాకుతో లేచి పోయి, రెక్కలు తట తట కొట్టుకొని, తలను అటు ఇటు త్రిప్పుచు, దినమంతయు తారుమారుగా నుండెను. చివరకు తన పంజరములోని కెగిరిపోయి ఆదినమంతయు రాజ్యలక్ష్మమ్మ యొద్దకు రానేలేదు.

ఇది వివేకముగల పక్షి కాదా?

# ప్రకృతి పాఠములు

## పుష్పాలనుగూర్చి బైబిలేమి చెప్పుచున్నది?



బైబిలునందనేకమారులు పుష్పాలనుగూర్చి మంచి సంగతులు చెప్పబడినవి. మనుష్యుడు పుష్పవంటివాడని ఒకచోట చెప్పబడెను. ఎందుకనగా పుష్పొకటిగా వాడి, ఎండిపోయి భూమిమీద రాలుచున్నదో ఆలాగుననే మనుష్యుడును చనిపోయి మంటికి మన్నును, బూడిదెకు బూడిదెయు నగుచున్నాడు. ఇట్టి సంబంధపు వాక్యములనేకములున్నవి గాని 1 పేతురు 1: 24 వచనములోని ఒక్క వాక్యము మాత్రమిచ్చట వ్రాసెదను. "సర్వశరీరులు గడ్డిని పోలినవారు, వారి అందమంతయు గడ్డి పువ్వువలెనున్నది; గడ్డివాడును దాని పుష్పము రాలును."

మనుష్యుని పుష్పకు బోల్చుటకు మఱియొక కారణమును గలదు? పుష్పాలు బహు కొద్ది కాలము మాత్రమే జీవించును. చాలకాలమువరకు మనము చూచునవికూడ స్వల్పకాలము మాత్రము జీవించునవియే. కొన్ని పుష్పాలు కొన్ని గంటల వఱకుమాత్రము బ్రదుకును. మనుష్యులలోను ఇంతేగదా.

కొందరు పసిగూనలుగా నున్నప్పుడే చనిపోదురు. ముసలి వారు పువ్వులవంటివారు కారని యుందువేమో. వారినడిగి చూడుము. వారు తాము బ్రదికినది బహు కొద్ది కాలము మాత్రమేనని యందురు. పసిపిల్ల కొన్నిగంటలు మాత్ర ముండు పువ్వువంటిదైతే, ముసలివారు కొన్ని దినములు జీవించు పువ్వువంటివారు. ఇదే భేదము. పువ్వులన్నియు చచ్చిపోవును. మనుష్యులందరును అంతే. ఇతరపువ్వులు, ఇతర మనుష్యులు వారి స్థలముల నాక్రమింతురు.

మనుష్యులు, పువ్వులవలెనే కోయబడుదురనియు బైబిలు చెప్పుచున్నది. కొందరు కాలమును ఒక ముసలివానికి బోల్చి, వానిచేతిలో పెద్ద కొడవలియున్నట్లు పటమును వేతురు దానిక్రింద ఈమాటలు వ్రాయబడియున్నవి.

గొప్పవారినేమి — కొద్దివారినేమి।
కాలమెల్లవారి — గూలజేయు॥

ముసలివారుగాని, పసివారుగాని అకస్మాత్తుగా చనిపోవు చుండుటవలననే, నరులు గడ్డివలెను, పువ్వులవలెను కోయ బడుదురని చెప్పబడుచున్నది. గుమగుమవాసనల గుప్పించి కొట్టుచు కంటికి మనోహరముగానుండు పువ్వును జూచిన యెడల వెంటనే దానిని కోసివేయుచున్నారుగదా! దాని కెంత యకస్మాత్తుగా నా దుర్దశపట్టినది! అదేలాగు మనము

మంచిస్థితిలోనుండి బలశాలురమై అందగాండ్రమైయున్నను మరణము మనలను కోసివేయును.

పువ్వుల సౌందర్యమునుగూర్చి "అడవిపువ్వు లేలాగు నెదుగుచున్నవో నాలోచించుడు. అవి కష్టపడవు, వడకవు. అయినను తన సమస్త వైభవముతో కూడిన సొలొమోను సహితము వీటిలో నొకదానివలెనైనను అలంకరింపబడలేదు" అని వ్రాయబడియున్నది. సొలొమోను గొప్ప భాగ్యవంతుడు గాన ఆయన కనేక సొగసైన వస్త్రములుండెను. అయితే ఒక చిన్న పుష్పముతో, ఆ వస్త్రములను సరిపోల్చినప్పుడు వీటి కుండు అందములో నూరవవంతైనను, ఆ బట్టలకు లేదని నీ నోటితోనే ఒప్పుకొందువు. భూతద్దమును పెట్టి చూచిన యెడల భేదము మరీ తేటపడును. దేవుని చేతిపని మనుష్యుల చేతిపనికంటె ఎంత శ్రేష్ఠమైనది!

## కుండ బిందె

ఒక యేటిలో వరద వచ్చినపుడు ఒక మంటికుండయును ఒక యిత్తడి బిందెయును కొట్టుకొనిపోయెను. ముక్కలై పోయెదనేమో అని మంటికుండ చాలా భయపడగా "భయపడవలదు. నా దగ్గరనే యుండుము, నేను నిన్ను కాపాడెద"నని బిందె అనెను. "ఓహో! సాధ్యమైనంత దూరముగా ఉండుము. నీ మూలముననే నాకు అపాయము వచ్చునని భయపడుచున్నాను. ఈ ప్రవాహ వేగమువలన నేను నీమీద పడినను, నీవు నామీద పడినను, నాకే నష్టమగును" అని కుండ అనెను.

సరిసమానులు మాత్రమే మంచి స్నేహితులగుదురు.

## 121

# రేగడిమంటిని, గులాబిపుష్పమును గురించి

ఒక దినమున నా స్నేహితుని యొద్దనుండి ఒక సువాసనగల రేగడి మంటిపెడ్డ వచ్చెను. నేను "నీసువాసన వలన నేను సంతోషించుటకు నీవు కస్తూరివా?" యని దాని నడిగితిని. అందుకది, "కాదు, నేను నిష్ప్రయోజనమైన రేగడి మంటి పెడ్డను. అయితే నేను సువాసనగల గులాబిపుష్పముతో బహుకాలము సాంగత్యము చేసినందువలన, దాని సువాసనలో నేను కొంత పాలు పొందితిని. లేనియెడల నేను, మునుపటివలెనే నీచమైన రేగడి మంటిపెడ్డనై యుందును" అని ప్రత్యుత్తరమిచ్చెను. ఆరు నెలలు సహవాసము చేసినయెడల వీరు వారును, వారు వీరును అగుదురను లోకోక్తి ననుసరించి మనమును సువాసన పొందవలెనంటె ఒక్క సత్పురుషుని వలనమాత్రము పొందగలము. లేనియెడ దుష్ట సహవాసము మంచినడవడిని చెడగొట్టును అను వేదవాక్యము నిజమగును. గులాబి పుష్పము ఒక రేగడి పెడ్డనుమాత్రము సువాసన గలదానినిగా మార్చెను. గాని ఒక సత్పురుషుడు గలడు. ఆయన సర్వ లోకములో నున్న సర్వ జనాంగములను సువాసన గల వారినిగా చేయగలడు. కావున నీవును మంచి సాంగత్యమును సువాసన పొందవలెననిన సజ్జనుడేయున సువాసన నిచ్చు ఆ మహానుభావుని స్నేహితుడవు కమ్ము. ఆయనే క్రీస్తు యేసు.





# బైబిలు పిల్లలు



నోవహు

ఏనోకు జీవించిన కాలములో తక్కిన ప్రజలు చెడుగా ప్రవర్తించి, నిజదైవమును విడచి, మోసపువలె కన్పించి క్షణములో మాయమైపోవు లౌకిక భోగములయందాసక్తి పరులైయుండిరి. మనతో నుండువారి సుగుణములైనను దుర్గుణములైనను మనకును వచ్చుట సహజమే కదా! అయితే నోవహు అనువాడు చిన్నతనమునుండియు మిగుల భక్తిపరుడును నీతి పరుడైయున్నందునను చెడువారి గుణములు అతనికి అబ్బనే లేదు.

చెడుప్రవర్తనకు తప్పక శిక్షవచ్చి తీరును. కావున దేవుడు ఆ ప్రజలను నాశనము చేయవలసి వచ్చెను. దేవుడు న్యాయవంతుడు. మంచివారినికూడ దుర్మార్గులతో దండించడు. గనుక

నోవహును ఆ గొప్ప శిక్షనుండి తప్పించెను. మనము మంచి వారమైతిమేని నోవహునువలె మన స్వంతవారినిని రక్షించు కొనగలము. ఆ ప్రజలకు వచ్చిన గొప్ప శిక్ష "జలప్రళయము" దేవుడు నోవహును, అతని భార్యను ముగ్గురు కుమారులను వారి భార్యలను, ప్రతి రకపు జీవరాసులలో నొక్కొక్క జతను ఒక గొప్ప ఓడలోనుంచి కాపాడెను. పాపము! వారి పాపములబట్టి నోరలేనట్టియు నిరపరాధమైనట్టియు మృగములు పక్షులు నాశనమొందెను. ఇతరులకు మనవలన కష్టములు రాకుండునట్లు మంచి నడత నడుచుదము. జలప్రళయమును గురించి మీరు ముందెరిగి యున్నను, మీ బైబిలు తెరచి మరల నొక్కసారి చదివి అంతయు సవిస్తరముగా తెలిసికొనుడు.

నలుబది రోజులు రేయింబగళ్లు కుంభవర్షము కురిసెను. నోవహు ఓడ చేయుచుండగా పక్కన నవ్విన ఆ ప్రజలు ప్రలాపింపసాగిరి. అందరును అంతమొందిరి. వర్షజలము ఆవిరియైపోయి నేల ఎండిన తర్వాత ప్రభువు చెప్పినట్లు నోవహు ఓడలోనున్న వారితోను, మృగ పక్షులతోను బయటకు వచ్చి మొదట ప్రభువునకు ఒక బలిపీఠము కట్టి కృతజ్ఞత చెల్లించెను. ఈ క్రొత్త సంవత్సరమున క్రొత్తగా "కృతజ్ఞత" యను గుణము గలిగియుండ నేర్చుకొందము.

# బాలమిత్ర టపా




ప్రియమైన బాలమిత్రులారా:—

నేను బందరు బోర్డింగులో చదువుకొనుచున్నాను. ఇప్పుడు నేను 2 వ ఫారము చదువుకొనుచున్నాను. నేను చదివెడి స్కూలు ట్రెయినింగ్ స్కూల్, మా బోర్డింగులో 120 మంది పిల్లలము ఉన్నాము. మాలో కొంతమంది ట్రెయినింగు తరగతిలో చదువుచున్నారు. సాయంత్రము 7 గంటలకు ప్రార్థన చేసికొందుము అందు ప్రతి మంగళవారము లక్ష్మీవారము బోర్డింగు సూపరింటెన్టుగారగు రెడ్‌మన్

దొరవారు ప్రార్థన చేయుదురు ప్రతి బుధవారము మా పంతులుగారు ప్రార్థన చేయుదురు. శుక్రవారమునాడు ప్రార్థన జరుపుటకు మా పిల్లలలో కొంతమంది యేర్పర్చబడి యున్నారు. వారు ప్రతి శుక్రవారము ఆ రోజునకు ఏర్పర్చబడిన కార్డు పాఠము ప్రార్థనలో చదువుదురు. వారిలో ఇష్టమున్నవారందరు ఇష్టము వచ్చిన వచనము తీసికొని ప్రసంగము చేయుదురు. శనివారము ఆదివారము హెడ్ మానిటరుగారివల్ల ఏర్పర్చబడిన ట్రెయినింగ్ వారు ప్రసంగము చేయుదురు. ప్రియ బాలమిత్రులారా! మా బోర్డింగు సహోదరులలో చాలామంది జ్వరమువల్ల పది దినములు చాలా కష్టపడిరిగాని, మీవంటి సహోదరుల విశ్వాసప్రార్థనల వల్లను దేవుని కృపవల్లను ఇప్పుడు సుఖము ననుభవించుచున్నారు. ప్రియులారా నేను, ఈ యుత్తరము వ్రాయకముందు బైబిలు తీయగా రోమా 13-వ అధ్యాయము 1-వ వచనము దొరికినది అందు దేవునికి భయపడుడి. "రాజును సన్మానించుడి" అని వ్రాయబడి యున్నది. ఈ యుత్తరము చదువు బాలమిత్రులారా! ఇప్పుడు యూరపు ఖండములో జరుగుచున్న గొప్ప యుద్ధమునందు మన రాజుగారికి జయము కలుగునట్లు దేవునిని వేడుకొనగలందులకు ప్రార్థించుచున్నాను.

ఇట్లు మీ ప్రియబాలమిత్రుడు
వేండేపల్లి యోనా, బందరు

# స్పర్శ

మనకు అయిదు ఇంద్రియములు ఉన్నవని చెప్పుచున్నాము. అవేవి? చూచుట, వినుట, వాసనచూచుట, రుచి చూచుట, తాకుట. ఇవి అయిదును మన శరీరమునకు అయిదు కిటికీలవలెగాని తలుపులవలెగాని ఉన్నవి. వీటి ద్వారా బయట ప్రపంచములో జరుగుచున్న వాటిని తెలిసికొందుము.



వీటన్నిటిద్వారా మనకు ముఖ్యముగా సౌఖ్యమే కలుగుచుండును. మనము జబ్బుగానున్నప్పుడు మాత్రమే మనకు బాధ ఎట్టిదో బాగుగా తెలియును. తెరవబడియున్న ఈ ద్వారములలో కడపటిదేది? సంతోష[illegible]యములు తల్లి యొక్క మృదువైన హస్తము, చిన్నబిడ్డ మెత్తనిబుగ్గ, కంబళి చొక్కా వెచ్చదనము, మనచేతులను పారుచున్న నదిలోని నీటిలో ముంచినప్పుడు కలుగు చల్లటిదనము మొదలగునవన్నియు ఎలాగు మనకు తెలియుచున్నవి? తాకుటవలననే గదా! గాలియొక్క హాయి, నిప్పుకాక భూమియొక్క కరుకుదనము తాకుటవలననే తెలియుచున్నవి. తాకు శక్తి మనలను అప్పుడప్పుడు జాగ్రత్తగానుండుమని తెలుపుచున్నది. బురదగుంటలో కాలు దిగబడునపుడు, చేతియందు సూది

ఉన్నప్పుడు, నిప్పు కాక తగిలినప్పుడు, జాగ్రతగా నుండవలె నని చెప్పునది ఈ శక్తి కాదా? అకస్మాత్తుగా కలుగు బాధనుండి తప్పించుకొనుమని మనలను హెచ్చరించుటకు దేవుడు పెట్టిన పిలుపువలెనున్నది. సంతోషించుటకును, హెచ్చరిక నొందుటకును స్పర్శజ్ఞానమును మనకు దేవుడిచ్చియున్నాడు. గాన మనమాయనకు కృతజ్ఞతలు దెలుపవలెను.

---

## గాలి మూట

విజయరామరాజు, దూరదేశమునకు యుద్ధము చేయుటకు వెళ్లెను. అది అంత అయిపోయిన తరువాత తిరిగి వచ్చునప్పుడు, దోవ తప్పెను. చాల కష్టములుపడి చిట్టచివరకు ఒక లంక చేరెను. ఆ లంక యొక్క రాజు ఆయనను చాల మర్యాద చేసి తన ఇంట్లో చేర్చుకొనెను. వారు తిరిగి బయలు దేరకముందు ఆ రాజుగారు విజయరామరాజుకు ఒక తోలు సంచిని ఇచ్చెను. దీనిలో ఒక్క గాలి తప్ప అన్ని గాలులు అనగా తూర్పుగాలి, చలిగాలి, వడగాలి, ఉత్తర గాలి మొదలగునవన్నియు, మూట కట్టబడియుండెను. వదలి పెట్టబడినది పడమరగాలి. ఓడ సరిగా పోవలెననిన యెడల ఇది ఒక్కటే కొట్టవలెను.

కొంతదూరము పోయిన తరువాత ఈ సంచిలో ఏమి ఉన్నదో చూడవలెనని విజయరామరాజు సేవకులకు తలంపు పుట్టెను. దాని నిండ నగలు, సొమ్ము, రత్నములు ఉన్నవని వారు తలంచిరి. వారి ముఖములు, చూపులు, మాటలు చూచి రాజుకు అనుమానము పుట్టినది. చుక్కానిని తాను పట్టుకొని ఓడను నడుపుటకు కోరెను. పడమటిగాలి నెమ్మదిగా కొట్టుచున్నందున అంత సరిగానే ఉండెను. తొమ్మిదినములవరకు విజయరామరాజు రాత్రింబగళ్లు నిద్రించలేదు. గాని వారు దేశము సమీపించిన తరువాత అతడు పండుకొని నిద్రపోయెను.

ఇదే తగిన సమయమని సేవకులు తలంచిరి. సంచిని విప్పవలెనని త్వరపడి తెరచిరి. బంగారమునకు బదులుగా అందులోను అన్ని గాలులు ఒక్కసారిలేచి ఓడను అన్ని దిక్కులకు విసరి కొట్టెను. అందరును బిత్తరపోయిరి. వారి దేశమునుండి ఎక్కడికో ఓడ కొట్టుకొనిపోయెను. తరువాత చాలకాలమునకు ఆ ఓడ వారి దేశము చేరినది.

“ ఆశ అన్ని విధముల చేటుతెచ్చును ”

C. L. S. PRESS, MADRAS—1915

